# మధుకలశమ్

రాయప్రోలు సుబ్బారావు

నవ్య సాహిత్య పరిషత్తు
△ గుంటూరు △

# పరిచయము

'ఎడ్వర్డు ఫిట్సుగెరాల్డు' అనే ఆంగ్లకవి ఉమరుకావ్యాన్ని ఫార్సీనుండి ఆంగ్లభాషలోకి అనువదించి ౧౮౫౯-వ సంవత్సరం ప్రకటించాడు. కొంతకాలంవరకూ ఆంగ్లపండితులూ, కళావేత్తలూ దీన్ని అంతగా పాటించలేదు. మొదటి ముద్రణప్రతులు చెత్త పుస్తకాలతో పాటు అణాకూ, రెండణాలకూ అమ్ముడు పోయినవి. కాలక్రమేణా, ఉమరుఖయాము ప్రతిభ ఫిట్సుగెరాల్డు అనువాదం వల్లనే అన్ని దేశాలలోనూ వ్యాపించింది. అనేక భాషలలో ఉమరు కావ్యం అవతరించింది. ఆంగ్లములోగూడ ఫిట్సుగెరాల్డు అనువాదముకాక, ఇతరులవికూడా బయలుదేరినవి. ఫిట్సుగెరాల్డు సైతము తన అనువాదాన్ని అనేక మార్పులుచేసి మూడు నాలుగు సార్లు ప్రకటించాడు. ఇతరుల అనువాదాలు ఫార్సీమూలమును ఎక్కువగా అనుసరించడానికి యత్నించి ఉండవచ్చును; కాని కాలం గడిచినకొద్దీ, ఫిట్సుగెరాల్డు అనువాదమే గణనకెక్కింది, ఎక్కుతున్నది గూడా. అందులోనూ, అతని మొదటి అనువాదమే

ఆంగ్లభాషలో స్థిరపడిపోయింది. ఎనిమిది శతాబ్దాలనాటి ఉమరు వాక్యాలను ఉదాహరించవలెనన్నా, అతని కవితాశక్తినీ భావగాంభీర్యాన్నీ చవిచూడవలెనన్నా, రసజ్ఞులందరూ ఫిట్సుగెరాల్డు ప్రథమ అనువాదాన్నే దృష్టిలో ఉంచుకుంటారు. సంస్కృత భారతాన్ని అనుసరించినా, తిక్కన భారతం స్వతంత్రకావ్యంగా వన్నెకెక్కినట్లే, ఫిట్సుగెరాల్డు అనువాదం ఆంగ్లభాషలో స్వతంత్రకావ్యమనే కీర్తి గడించింది. 'గ్రే' కవి 'ఎలిజీ', 'టెన్నిసన్' కవి 'ఇన్ మిమోరియం' వంటి స్వతంత్ర రచనలకన్న ఈ ఫిట్సుగెరాల్డు అనువాద కావ్యమునుంచే పద్యపంక్తులనూ, విడివాక్కులనూ, సారస్వతప్రియులూ, సామాన్యపౌరులూ గూడ ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉంటారు. ఫిట్సుగెరాల్డు సూక్తులు ఆంగ్లనుడికారంలో లీనమైనవి.

అసలు ఉమరుకావ్యంలో ఉన్న ఘనత ఏమిటి? తరతరాల నుండీ అన్ని దేశాలవారూ అతన్ని మెచ్చుకుని పదేపదే అతని పద్యాలను ఉదాహరించడ మెందుకు? "ఉమరుఖయాము సంఘాల" లోచేరి రసజ్ఞులు ఉమరు సందేశాన్ని తనివితీర - ఉమరు మధువును క్రోలినట్లే-ఆస్వాదించడమెందుకు? మానవ హృదయంలో సృష్ట్యాది నుండీ అణిగియున్న సందేహాలనే, ఆవేదనలనే ఉమరు తన కావ్యంలో బహిర్గతం చేశాడు. ముఖ్యంగా, "కలదు కలండనెడి

వాడు కలడో లేడో'' అన్న భయంకరమైన ప్రశ్నను గజేంద్రుడితో పాటు, సంశయగ్రస్తులైన సర్వమానవులతో పాటు, ఉమరుకూడా వేశాడు. అంధప్రాయమైన మూఢనమ్మకంతో తృప్తిచెందక, దీని అంతు కనుక్కోవలెనని జీవితమంతా పాటుపడ్డాడు. పండితులతో, వేదాంతులతో తర్కించాడు. అతని సందేహం తీరలేదు. వెళ్లినదారినే తిరిగి వచ్చినట్లయింది, అతనికృషి. ఉమరు భాషా వేత్త; జ్యోతిశ్శాస్త్రంలో నిధి; వేదాంతులతో చెలిమిచేసినాడు; ముందు వెనుక లాలోచించకుండా అవివేకులవలె నాస్తికవాదంలోకి దిగలేదు. కాని, అప్రత్యక్షమై, అనుభవదూరమైన విషయాన్ని గూర్చి అంతులేని తర్కంలోకి దిగడం వృధాప్రయాస అనుకున్నాడు. "ధర్మమూర్తీ, దయాస్వరూపుడూ, అయిన మహావ్యక్తి ఈ సృష్టినంతా శాసిస్తున్నట్లయితే, ఆతడే సర్వాన్నీ చక్కపెట్టుతాడు; అన్యాయంగా, నిరంకుశంగా మనలను నరకకూపంలోకి త్రోయడు. అంతా శుభంగానే పరిణమిస్తుంది. ఇంతకన్న మనస్సును చీకాకుపెట్టుకోవడమెందుకు ?" ఇదే ఉమరు దృష్టి.

జీవితంలో కష్టమూ ఉన్నది; సుఖమూ ఉన్నది. సృష్టిలో అందవికారమూ ఉన్నది; అందమూ ఉన్నది. కండ్ల ఎదుట ఉన్న అందాన్నిచూచి సంతోషించడమూ, మనసుకు న్యాయంగా అందు

బాటులో ఉన్న సౌఖ్యాన్ని అనుభవించడమూ తప్పుకాదే! గులాబి పుష్పంలోని లావణ్యం నశిస్తుందనీ, ప్రియురాలి వదనంలోని కాంతి తగ్గుతుందనీ, మధుపాత్రలో మధువు ఇంకిపోతుందనీ ఎవరికి తెలియదు? ఈ సౌఖ్యమూ, ఈ సౌందర్యమూ క్షణికమే కావచ్చును. అంతమాత్రంచేత, ఆక్షణములోనే వాటిని ఎందుకు అనుభవించ కూడదు? ఇది కేవలం విషయవాంఛానిమగ్నత కాదు. వివేకీ, రసపిపాసువూ, అయిన సత్పురుషుని సౌందర్యోపాసన. గమ్య స్థానానికి ఇదికూడ ఒక మార్గమేమో!

ఉమరు 'మధువు' 'పానపాత్ర,' 'ప్రియురాలు,' వంటి మాటలను వాడినప్పుడు, వాటికి వేదాంతపరమైన గూఢార్థముండి తీరవలెనని వాదించేవారు కొందరున్నారు. జీవాత్మ పరమాత్మల పరస్పర సంధానమునుగూర్చిన 'సుఫీ'ల సిద్ధాంతాలనే ఉమరుకూడ తన కావ్యంలో చేర్చాడని వీరి నమ్మకం.

కాని, 'సుఫీ'లంటే ఉమరుకు గిట్టదు. వారుకూడా అతని నిరసనకు గురియైన "డెబ్బదిరెండు శాఖల" లోనివారే. అంతరార్థంతో నిమిత్తంలేకుండ, స్పష్టంగా పైకికనుపిస్తున్న అర్థమే సరియైనదని ఉమరు కావ్యాన్ని పరిశీలించిన పండితులలో అనేకమంది అభిప్రాయ పడుతున్నారు.

ఆంగ్లానువాదంలో కొన్నిచోట్ల, పార్శీ మూలంలోలేని భావాలు చేర్చబడినవి. ౫౮-వ పద్యం చివర, సృష్టికర్త మానవుని క్షమించడమే కాకుండా ఆతనివల్ల తానే క్షమాపణ పొందవలెనన్న భావం ఫిట్సుగెరాల్డుదే. అదేవిధంగా, ౫౦-వ పద్యంలో "సర్వమూ ఆతడే ఎరుగును" అని భగవంతునిగురించి చెప్పిన భావంకూడా ఫిట్సుగెరాల్డు స్వంతమే. ఆంగ్లకవి, పార్శీ కావ్యాన్ని చక్కగా పఠించి, హృద్గతంచేసుకుని, తనలో భాసించినరీతిని అనువదించాడు.

శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు ఫిట్సుగెరాల్డు మొదటి ఆంగ్లానువాదాన్ని అనుసరించారు. ఆంగ్లములోని భావాలను చాలా సరసంగా తెనుగులోకి తేగలిగినారు. కొన్నిచోట్ల, తమ ప్రతిభా విశేషంచేత, క్రొత్త అందాలు సమకూర్చినారు. ఉదాహరణంగా కొన్ని చూపుతాను, 3-వ పద్యంలో, ఆంగ్లంలో :

"...Open then the door" అన్నవాక్యాన్ని,

"....ఎందుల కూరక యాలసింత్రు రారేమి కవాటముల్ తెరవరేమి?...." అని తెనిగించారు. ౨౩-వ పద్యం చివరపాదం :

"Sans Wine, sans Song, sans Singer, and—sans End !" అన్నవాక్యాన్ని,

"....మధువెండును పిమ్మట గాన మాగు గాయనులును నిద్రపోదురు లయశ్రుతులు౯ చెవికందవాపయి౯" అని ఎంతో రసవంతంగా వివృతంచేశారు. ౫౧-వ పద్యంలో :

"Nor thy Tears wash out a Word of it" అన్నచోట,

"....అలిఖితంబున నొక్క ముక్కయు౯ చెఱిగదు నీదు బాష్పములు చెర్వయి వాగయి వెల్లివోయిన౯," అని అనువదించారు. ఈ సందర్భాలన్నిటిలో శ్రీ సుబ్బారావుగారి తెలుగు పద్యాలు చదివి చదివి మహదానందాన్ని పొందినాను. వీరు తమ కావ్యమంతా చంపకమాల, ఉత్పలమాల వంటి వృత్తాలలో వ్రాశారు. ఆంగ్లంలోని ఫిట్సుగెరాల్డు పద్యాల నడకకు సాధ్యమైనంత సామీప్యంలో ఉన్నవి మన వృత్తాలే.

ఇంకొక విశేషం. పార్శీలోగాని, ఆంగ్లంలోగాని లేని ఒక నూతన పద్ధతి వీరి కావ్యంలో కనిపిస్తున్నది. ఉమరు తన కావ్యాన్ని ఒక్కసారిగా వ్రాయలేదు. ఎప్పుడో బుద్ధిపుట్టినప్పుడు ఏవో కొన్ని భావాలను ప్రకటించేవాడు. వేమనపద్యాలవలెనే, ఉమరు పద్యాలు ఐక్యత (Unity)గల కావ్యంగా ఏర్పడవు. శ్రీ సుబ్బారావుగారు చాలావరకు ఉమరు తన ప్రియురాలిని సంబోధించినట్లుగా ఒక

సంకేత మేర్పరుచు కున్నారు. ఉమరు తన ఊహలనూ, అనుభవాలనూ అందమైన పరిసరాలలో, ఎదుటనున్న ప్రియురాలితో చెప్పుతున్నట్లు కల్పించాడు. అందుకే, మూలానికి వ్యతిరేకమైనా, ౪౨ వ పద్యంలో :

"...an Angel Shape Bearing a Vessel on his shoulder..." అన్న పంక్తిని,

"....కాంచనభాండము నంసభాగమందిడి మెలమెల్ల కాలిడి యె నేకత మీమధుశాల వాకిటఁ బడతి యొకర్తె:... ."

అని మార్చినారు. ఈ విధానంవల్ల వీరి ఆంధ్రానువాదానికి ఐక్యతా, రసపుష్టీ సమకూరినవి.

శ్రీ సుబ్బారావుగారు ఇందులో కొన్ని పద్యాలు అనేక సంవత్సరాలనాడే రచించారు. ౧౯౨౪ వ సంవత్సరం 'భారతి'లో వాటిని ప్రకటించారు. ఈ నాటికి వారి 'తృణకంకణ' రజతోత్సవ ముద్రణకాగానే, దీనిని ఆంధ్రలోకానికి అం కిచేస్తున్నారు. ఆంగ్ల భాషలో ఫిట్సుగెరాల్డు కావ్యంవలెనే, తెలుగులో వీరి అనువాదం స్వతంత్రకావ్యమన్నట్లే ప్రశంస పొందుతుంది. ఆంగ్లవాసన లేనివారైనా, అమృతోపమానమైన వీరి కవితారసాన్ని చవిచూచి

ఆనందించగలరు. శైలియందేమి, భావప్రకటన యందేమి శ్రీ సుబ్బారావుగారిది అందెవేసినచేయి.

ఇట్టి ఉత్తమకావ్యానికి పరిచయవాక్యం వ్రాయగలశక్తి నాకు లేదు. కాని శ్రీ సుబ్బారావుగారు 'లలిత' 'తృణకంకణము' రచించక పూర్వమే వారి స్నేహభాగ్యం నాకు లభించింది. చిన్ననాటినుండీ పెంపొందుతూఉన్న ఈ గాఢస్నేహానికి ఏదో శాశ్వత చిహ్నం ఉండవలెనను మా ఇరువురి కాంక్షకు ఈ పరిచయవాక్యం ఫలితం.

నిజానికి, కవికీ చదువరికీ మధ్య ఈ రాయబారమెందుకు? ఇంతటితో నిలుస్తాను. ఇక 'మధుకలశా'న్ని ఆరాధించండి.

'విశ్రాంతిమందిరం'
నంద్యాల
౨౫. ౧౨. ౧౯౩౭.

కోలవెన్ను రామకోటీశ్వరరావు

౧౯౪౪ సం. డిసెంబరు ౨౫ వ తేదీని మా 'త్రివేణి' పత్రిక జననము. పదకొండేళ్లు నిండినవి. 'త్రివేణి' పుట్టినరోజు పండుగనాడే ఈ వ్యాసాన్ని వ్రాయడం శుభంకదా! కో. రా.

1

Awake! for Morning in the Bowl of Night
Has flung the Stone that puts the Stars to Flight:
And Lo! the Hunter of the East has caught
The Sultan's Turret in a Noose of Light.

2

Dreaming when Dawn's Left Hand was in the Sky,
I heard a Voice within the Tavern cry,
"Awake, my little ones, and fill the Cup
Before Life's Liquor in its Cup be dry."

3

And, as the Cock crew, those who stood before
The Tavern shouted—"Open then the Door!
You know how little while we have to stay,
And once departed, may return no more."

౧

లెమ్ము! నిశాకపుండలుతలిన్ పడగా విసరెన్ ప్రభాత మం
దమ్ములదిఙ్మణిన్ చకితతారక లావల బాఱి, కాంతిసూ
త్రమ్ములయుచ్చు లొడ్డెను సుతారపు తూరుపువేటకాడు ర
మ్యమ్మగు పాదుషాకనకహర్మ్యశిఖాకలశాలిచుట్టునన్.

౨

చదల నుషఃకుమారి చెయిచాయలు లోపగ, "కల్వరించుచున్
మెదలక యాలకించితి సమీపసురాభవనమ్మునం దిటుల్,
'నిదురలు మాని మేలుకొని నింపుడు పాత్రను చిన్నలార! త
త్పదమలజీవనార్ద్రమధుధారలు ఎండకమున్నె బుంగలన్.

౩

ఆమధుశాలముందట ప్రియాన నిలంబడి కోడి కూయగా
సీమెయి చప్పటుల్ చఱచి 'రెందుల కూరక యాలసింత్రు రా
రేమి కవాటముల్ తెఱపరేమి? ముహూర్తము మించిపోయినన్
రా మిక నెన్నియేండ్లకును, ప్రజ్వలితాసవ మెందు నింతలోన్.'

4

Now the New Year reviving old Desires,
The thoughtful Soul to Solitude retires,
Where the 'White Hand of Moses' on the Bough
Puts out, and Jesus from the Ground suspires.

5

Iram indeed is gone with all its Rose,
And Jamshyd's Sev'n-ring'd Cup where no one knows;
But still the Vine her ancient Ruby yields,
And still a Garden by the water blows.

6

And David's Lips are lock't; but in divine
High-piping Pehlevi, with "Wine! Wine! Wine!
*Red* Wine!"—the Nightingale cries to the Rose
That yellow Cheek of hers t'incarnadine.

౪

ముదిసినముచ్చటల్ మఱల మోసలువోయి ఉగాదికోర్కె కా
స్పదమగు నాత్మయున్ విజనవాటికకై విరమించు, నచ్చటన్
సదమలశాఖిశాఖల కనంబడు మోసెసుశ్వేతహస్త, మిం
పొదవగ భూమినుండి పయి కుబ్బెడి జీసను దైవికాంశయున్.

౫

పాదులతో గులాబిసుమబంధము లెండె ఇరానుతోట, జ
ష్మీదునృపాలకుండును శమించె త్రికాలఘటీసమేతుడై,
పైదలి! నేటికిన్ మధువు పాఱెడు ద్రాక్షలు ప్రాతగిల్లినన్,
స్వాదుపయఃప్రవాహముల పజ్జను పూచెడు తోట లిప్పుడున్.

౬

తమసంగీతము లాపి మౌనమున గంధర్వుల్ కడంబోయి రే
కముగా నెప్పుడో! కాని బుల్బులి సుధాకంఠంబుతో గూయు తీ
యము లూగన్ మధువో! ప్రవాళమధువో! యంచున్ గులాబీకపో
లములన్ పాండిమ విచ్చి క్రమ్మర జపాలావణ్య ముప్పొంగగన్.

7

Come, fill the Cup, and in the Fire of Spring
The Winter Garment of Repentance fling ;
The Bird of Time has but a little way
To fly—and Lo ! the Bird is on the Wing.

8

And look—a thousand Blossoms with the Day
Woke—and a thousand scatter'd into Clay :
And this first Summer Month that brings the Rose
Shall take Jamshyd and Kaikobad away.

9

But come with old Khayyam, and leave the Lot
Of Kaikobad and Kaikhosru forgot :
Let Rustum lay about him as he will,
Or Hatim Tai cry Supper—heed them not.

౭

మఱుగు వసంతవహ్నినడుమంబడ నీయనుతాప శీతచీ
వరమును బాఱవేసి మధుపాత్రను నింపగ రమ్మ నెచ్చెలీ!
పఱచు వయశ్శకుంతరసవత్పథమో కడుకొంచె మున్న, దా
తుఱముగ విచ్చెడిన్ మెలపుతో తన కుచ్చులరెక్కలల్లదే.

౮

వేలకువేలు పూజతలు వేకువతో వికసించు చూడుమీ,
రాలెడు నేలపాలగుచు రాగిణీ! యింకొకవేయిపూలు, రో
జాలను దెచ్చు నీఱుభవసంతుడె యెత్తుకపోగలాడు ది
క్పాలసమానులౌ 'కయికౌబాదును జంషిదు' రాజరత్నమున్.

౯

చెలి! మన కేమి కావలయు శీఘ్రము రమ్మిటు లీవు ముక్తదుః
ఖులయిన 'కైకౌబాదు కయిఖుస్రుల' గాథలు కట్టిపెట్టి; మాం
సలరణరక్తి రుస్తుము భుజాలనె జొత్తిలుగాక, చల్దికై
కలగి 'హాతీముతాయి' పడుగాక వెతల్, వినబోకు మింతయున్.

10

With me along some Strip of Herbage strown
That just divides the desert from the sown,
Where name of Slave and Sultan Scarce is known,
And pity Sultan Mahmud on his Throne.

11

Here with a Loaf of Bread beneath the Bough,
A Flask of Wine, a Book of Verse—and Thou
Beside me singing in the Wilderness—
And Wilderness is Paradise enow.

12

" How sweet is mortal Sovranty ! "—think some :
Others—" How blest the Paradise to come ! "
Ah, take the Cash in hand and waive the Rest ;
Oh, the brave Music of a *distant* Drum.

౧౦

అడవికి తోటకున్ నడుమ హద్దగు నీపొదరింటిపొంత నె
న్నడును నృపుండుసేవకు డనంజను భేదము సుంతయేని యే
ర్పడ, దపరంజిగద్దెపయి రాచరికంబులు సల్పుచున్ సుడిం
బడు సులతానుపట్ల అతివా! అనుకంప వెలార్త మర్థిమై.

౧౧

ఈసుమశాఖచెంగట సఖీ! రుచు లూరెడు వెన్నగొట్టెయున్,
ఆసవపూర్ణపాత్రికయు నందపుపాటలపుస్తకమ్ము సా
వాసముజేయ, నీ వడవివాడల నాడుచు పాడుకొంచు నా
తో సుఖముండ, నింక కలదో యిది స్వర్గముగాక యెక్కడో.

౧౨

మరగిన యైహికేచ్ఛలభ్రమన్ పెనగొందురు కొంద, రెన్నడో
యొరగెడి స్వర్గభోగముల కోపిక నీడ్చెద రింక గొంద, ఱీ
తిరుగుడు లేటికో? అసలు తీసుక శేషము నంటబోకు, మా
తురపడి పర్వులెత్తెదవు దూరపుపాటల కెంతచిత్రమో!

13

Look to the Rose that blows about us—" Lo,
Laughing," she says " into the World I blow :
At once the silken Tassel of my Purse
Tear, and its Treasure on the Garden throw."

14

The Worldly Hope men set their Hearts upon
Turns Ashes—or it prospers ; and anon,
Like Snow upon the Desert's dusty Face
Lighting a little Hour or two—is gone.

15

And those who husbanded the Golden Grain,
And those who flung it to the Winds like Rain,
Alike to no such aureate Earth are turn'd
As, buried once, Men want dug up again.

౧౩

మనమొగసాల విచ్చు సుకుమారిగులాబిని చూచు మిట్లు ప
ల్కెను సఖి ! 'నవ్వుచున్ పసుథకుం జని, త్రెంచెదనందు నాదు చ
క్కనివరహాలసంచులమొగాల బిగించిన పట్టుత్రాళ్ళు, ప
చ్చనిపువుతోటలోన వెదజల్లుదు నాయరణంపుభాగ్యముల్'.

౧౪

జను లతికాంక్షతో వలచు జంగమభోగము లొక్కవేళ పం
డిన తెగబండవచ్చు, నపనిన్ బడి యెండిన నెండవచ్చు. మో
హనశిశిర ప్రభాతసమయంబుల శుష్కవనీముఖస్థలిన్
మినుకుమెఱుంగు లీనవె నిమేషము రాలు తుషారబిందువుల్.

౧౫

సన్నపసిండిసస్యమును సంతనచేసిన భాగ్యవంతు, లా
కన్నెకడానివిత్తనము గాలికి జల్లెడు భోగమూర్తులున్
మన్నయిపోదు ; రింతె తుది మాఱరు బంగరుధూళి గాగ, ఆ
సన్నులుగారుసూ ప్రజలునై తము వారల త్రవ్వియెత్తగన్.

16

Think, in this battered Caravanserai
Whose Doorways are alternate Night and Day,
How Sultan after Sultan with his Pomp
Abode his Hour or two, and went his way.

17

They say the Lion and the Lizard keep
The Courts where Jamshyd gloried and drank deep
And Bahram, that great Hunter—the Wild Ass
Stamps o'er his Head, and he lies fast asleep.

18

I sometimes think that never blows so red
The Rose as where some buried Caesar bled;
That every Hyacinth the Garden wears
Dropt in its Lap from some once lovely Head.

౧౬

రేలుబవల్ కవాటములరెక్కలుగాగల ఈయెడారి స
త్రాలకు వచ్చుచుంద్రు సులతాను లొకం డెడలన్ మఱొక్క డాం
దోళిక లెక్కి; ప్రాభవముతో వసియింతురు రెండుమూడునా,
ళ్ళోలగ మాపి యంత నెటకో విరమింతురు, కంటె, నెచ్చెలీ!

౧౭

'జముషిదు' శీధు వానుచు యశస్సఖినేలిన నేలలందు సిం
హాములు సివంగులున్ సలుపు న్యాయసభాక్రమ మంత్రు నేడు, 'బై
రము' మృగయామదాంధుని శిరం బెట వ్రాలెనో అయ్యోడన్ యథే
చ్ఛముగను త్రొక్కు గార్దభము; దాన జలింపడు నిద్ర నాతడున్.

౧౮

కడు నరుణమ్ముగా నెచట కన్నెగులాబి హాసించు నచ్చటన్
పడదగు మున్ను 'సీజరు' నృపాలుని రక్త మటంచు నెంతు, ఎ
క్కడ వికసించు దాసనలు గంపలు గంపలుగా వనాల న
క్కడ నొక అప్సరస్సఖి నిగారపువీడెము రాలియుండెడిన్.

19

And this delightful Herb whose tender Green
Fledges the River's Lip on which we lean——
Ah, lean upon it lightly ! for who knows
From what once Lovely Lip it springs unseen !

20

Ah, my Beloved, fill the cup that clears
To-day of past Regrets and future Fears—
*To-morrow ?*—Why, To-morrow I may be
Myself with Yesterday's Sev'n Thousand Years.

21

Lo ! some we loved, the loveliest and the best
That Time and Fate of all their Vintage prest,
Have drunk their Cup a Round or two before,
And one by one crept silently to Rest.

౧౯

కలకలనవ్వు తేటసొనకౌగిట నూగుచు బాలపల్లవాం
గుళి బ్రతిమాలు ఈహరితకుంజలతన్ కదిలింప కంతగా;
కలికి! నఖక్షతిన్ మధువు గ్రక్కని యేచెలి కావిమోవి ఈ
చెలియలి తీవెకున్ మనసుచెల్లని ముచ్చట లప్పగించెనో.

౨౦

గతదివసప్రపీడనయు గాఢభవిష్యదపోహభీతియున్
హత మొనరింపజాలు మధు వందపుగిన్నియ నిండ నింపు; మీ
వితమున రేపురేపని తపించెద వుగ్మలి! యెన్ని 'రేపు' లీ
క్షితిపయి 'నిన్న'లందు గలసెన్ గతకాలమయాబ్ధరాశిలోన్.

౨౧

నయమతు లాప్తు లార్ద్రిసుమనస్కులు నౌమసమిత్రు లెంద రీ
ప్రియమగు తోటలో తమయదృష్టవశమ్మగు ద్రాక్షపండ్లు పిం
డి యొకటి రెండుగిన్నియలు నిండుగ ద్రావి, విరామలాలసా
శ్రయు లయిరో సఖీ! యొకరు జాఱగ నొక్కరు తోడుతోడుగన్.

22

And we, that now make merry in the Room
They left, and Summer dresses in new Bloom,
Ourselves must we beneath the Couch of Earth
Descend, ourselves to make a Couch—for whom?

23

Ah, make the most of what we yet may spend,
Before we too into the Dust descend;
Dust into Dust, and under Dust, to lie,
Sans Wine, sans Song, sans Singer, and—sans End!

24

Alike for those who for To-day prepare,
And those that after a To-morrow stare,
A Muezzin from the Tower of Darkness cries
"Fools! your Reward is neither Here nor There!"

౨౨

కులికెడు క్రొత్తశోభనపుకోకలు తాలిచి గ్రీష్మదూతి; న
వ్వులతిరునాళ్ళలోన తనివోముగదే మన మిందు, ముందు రా
గిలిన ప్రియుల్ గతించిరి సఖీ! మన మేగమె యింక భూమిక్రిం
దల బవళింప! నెవ్వరికొ తల్పములౌదుముగామె యావలన్.

౨౩

మనమును మంటిక్రిందపడి మాయకపూర్వమె లబ్ధమైనదా
ని ననుభవింపజెల్లు తరుణీ! అటుపిమ్మట ధూళి ధూళితో
నెనసి యణంగిపోవు, మధు వెండును, పిమ్మట గానమాగు, గా
యనులును నిద్రవోదురు, లయశ్రుతులున్ చెవి కంద వాపయిన్.

౨౪

వేడుక నేటిభుక్తికి లభించినదెల్ల వ్రయించు పుణ్యులున్
పీడితు లయ్యు రే పనుభవింపగ దాచు నికృష్టులున్ వినన్
పాడెదు చిత్రగుప్తుడు తమాలనికుంజమునుండి, 'ఏల యీ
యేడుపు మూర్ఖులార! ఫలియింపదు మీకృషి యిందునందునన్'.

౨౫

25

Why, all the Saints and Sages who discuss'd
Of the Two Worlds so learnedly, are thrust
Like foolish Prophets forth ; their Words to Scorn
Are scatter'd, and their Mouths are stopt with Dust.

26

Oh, come with old Khayyam, and leave the Wise
To talk ; one thing is certain, that Life flies ;
One thing is certain, and the Rest is Lies ;
The Flower that once has blown for ever dies.

27

Myself when young did eagerly frequent
Doctor and Saint, and heard great Argument
About it and about : but evermore
Came out by the same Door as in I went.

౭౫

ఇహపరలోకతర్కములనెంతో చలంపడి శాస్త్రులున్ గురూ
ద్వహులును పెక్కు రేగిరి, పదంపడి వారిభవిష్యదర్థసం
గ్రహమును త్రుప్పువట్టె, సుడిగాలికి బోయె తదీయబోధనా
మహిమయు, దుమ్ముగొట్టికొని మానెను వారిసమాధులున్ చెలీ!

౭౬

ఆవేదాంతుల శుష్కతర్కముల వ్యాఖ్యానింపగానిమ్ము, నీ
వీవృద్ధున్ సుఖపెట్ట రమ్ము సకియా! యేకాంతపున్ సేవ; ఏ
పూవుల్ విచ్చు శుభప్రభాతముల నాపూలన్నియున్ రాలు సం
ధ్యావేళన్, నిజ మిద్ది; తక్కినది మిథ్యావాద మింకేటికిన్.

౭౭

నేనును బాల్యమం దధికనిష్ఠమెయిన్ గురుపాదసన్నిధిన్
మానుగ నాలకించితి ప్రమాణములైన పరేంగితార్థముల్
కాని; నిజాన కెప్పుడును కన్నులు విప్పక బైట వచ్చితిన్
పూనిక వీడి, లోపలికి బోయిన వాకిటనే సఖీమణీ!

28

With them the Seed of Wisdom did I sow,
And with my own hand laboured it to grow:
And this was all the Harvest that I reap'd—
"I came like Water, and like Wind I go."

29

Into this Universe, and *why* not knowing,
Nor *whence*, like Water willy-nilly flowing:
And out of it, as Wind along the Waste,
I know not *whither* willy-nilly blowing.

30

What, without asking, hither hurried *whence*?
And, without asking, *whither* hurried hence!
Another and another Cup to drown
The Memory of this Impertinence!

౨౮

వారలతోడ నేనును అవంధ్యములై తగు జ్ఞానబీజముల్
కారున జల్లి సొంతముగ కష్టముజేసితి, పండిసట్టి అం
బార మిదేసుమీ సకియ! వచ్చితి నచ్చపునీరమట్టు, లా
కారములేని గాలివలె కన్పడ కేఁగుదు గుర్తులాఱగన్.

౨౯

ఏమిపనో యెఱుంగక మహిం బడితిన్, ప్రవహించుచుంటి నే
భూముల నింకనో జలముపోల్కి ననిష్టమొ! యిష్టమో సఖీ!
ఈమధువాటికన్ విడిచి యేదెసకో సుడివోదు చౌటి ఱా
సీమల వీచుగాడుపులచే, మది నచ్చిన నచ్చకుండినన్.

౩౦

ఇచటికి నన్ను ద్రోయునపు డించుక కోరడు నాయభీష్ట, మిం
కెచటికొ యిందునుండి యెడయించెడునప్పుడు చెప్పబోవ, దే
ల చఫలతర్క మిట్లు వగలంబడ; ఏమిటికీప్రగల్భముల్,
రుచిగల శీధుపాత్రను మెఱుంగులవాతెఱ జేర్పుమీ సఖీ!

31

Up from Earth's Centre through the Seventh Gate
I rose, and on the Throne of Saturn sate,
And many Knots unravell'd by the Road ;
But not the Knot of Human Death and Fate.

32

There was a Door to which I found no Key :
There was a Veil past which I could not see :
Some little Talk awhile of Me and Thee
There seem'd—and then no more of Thee and Me.

33

Then to the rolling Heav'n itself I cried,
Asking, " What Lamp had Destiny to guide
Her little Children stumbling in the Dark ? "
And—" A blind understanding ! " Heaven replied.

౩౧

ఇల నడిబొడ్డునుండి వడి 'ఏడవవాకిట' బైటవచ్చితిన్
చెలగి 'శనైశ్చరుం' డధివసించెడుగద్దియ నెక్కితిన్, పథాం
చలమున బెక్కుముళ్ళు బిగి సళ్లగ విప్పితి; నైనగాని చి
క్కెడల దొకింత మృత్యువను ఈముడి మెక్కె లవెన్ని తీసినన్.

౩౨

ఒకతలు పుండె! దానిగడె లూడ్చెడుబీగము కానరాదు, వే
ఱొకతెర యుండె! ఆవెనుక సున్నది చూడగలేకపోతి, నిం
చుక వినినట్టులయ్యె నట సుంత'నినున్ నను'గూర్చి ముచ్చటల్
సకి! యటుమీదటన్ మనప్రశంస రవంతయు పల్క రెవ్వరున్.

౩౩

అంత తెగించి గోడివడు నాకసముం గని "చిమ్మచీకటిన్
సుంతయు దారి గన్పడక సోలుప్రజాలికి బాటసూప ఏ
కాంతులకాగడా కలదు కాలపుహస్తమునం" దటంచు "వి
భ్రాంతుడ! అంధతుల్యమగు భక్తియె సు"మ్మని మాఱు వాకొనెన్.

౩౪

34

Then to this earthen Bowl did I adjourn
My Lip, the Secret Well of Life to learn :
And Lip to Lip it murmur'd—" While you live
Drink ! for once dead you never shall return ! "

35

I think the Vessel, that with fugitive
Articulation answer'd, once did live,
And merry-make ; and the cold Lip I kiss'd
How many Kisses might it take—and give !

36

For in the Market-place, one Dusk of day,
I watch'd the Potter thumping his wet Clay :
And with its all obliterated Tongue
It murmur'd—" Gently, Brother, gently, pray ! "

౩౪

ప్రణయిని ! నే నంతరము భౌతికభాండము డాసి గుప్తజీ
వనతటినీతటం బెఱుగువాంఛను వావిడి వేడికొంటి ; నే
మనియెనొ వింటివా "బ్రతికినన్నిదినంబులు త్రావవోయి తీ
యనిమధువున్ గతించియును ఆవల వచ్చుట మిథ్య సుమ్మిలన్"

౩౫

కలగి యెలుంగు తొట్రుపడగా బదులాడిన యాఘట మ్మొక
ప్పుడు సుఖముండి వేడుకల బొంపిరివోవగ నోపునంచు నే
దలచెద నెచ్చెలీ ! కలలు తగ్గిన తద్వదనమ్ముగూడ నిం
పొలయగ నిచ్చి పుచ్చుకొనెనో ముసు పెన్ని మిటారిముద్దులన్.

౩౬

ఒక దివసప్రదోషమున ఓపికతో కనిపట్టినాడ శ
క్తి కొలది నార్ద్రమృణ్మథనకృత్యము సల్పెడు కుంభకారునిన్ ;
సకియరొ ! సన్నగిల్లిన విషాదరుతిన్ బ్రతిమాటె నాఘటం
బకట ! 'కృపాపరుండవయి అన్నరొ ! మెత్తగ నొత్తు'మం చొగిన్.

37

Ah, fill the Cup :—what boots it to repeat
How time is slipping underneath our Feet :
Unborn To-morrow and dead Yesterday,
Why fret about them if To-day be sweet!

88

One Moment in Annihilation's Waste,
One Moment, of the Well of Life to taste—
The Stars are setting and the Caravan
Starts for the Dawn of Nothing—Oh, Make haste

39

How long, how long, in infinite Pursuit
Of This and That endeavour and dispute?
Better be merry with the fruitful Grape
Than sadden after none, or bitter, Fruit.

౩౭

వృథ కథ జెప్పనేల కృశియించుచున్నది ఆయువంచు, నీ
మధుకలశమ్ము నింపుము సుమంగలి! పుట్టని 'రేపు'కోసమై
శిథిలతగన్న 'నిన్న'కయి చింతలవంతల మున్గనేటికో!
మధురములేని 'నేడు' లనుమానము మాని సుఖింపు మర్థిమై.

౩౮

ఒకనిముసాన జీవకళ లుచ్చిన పాడుశ్మశానవాటి, నిం
కొకనిముసాన జీవితపయోనిధి పజ్జన! నిల్తు మద్దిరా!
సకి! కనుమాసె తారకలు, సాగిరి యాత్రికులెల్ల, శూన్యరూ
పకమగు దిఙ్ముఖోదయముపై తమ లక్ష్యముపెట్టి వేగమే.

౩౯

ప్రమదరో! 'నేతి నేతి' యని పారము కానగరాని ఈవివా
దముల నలంగు దెందనుక? ధారలుధారలుగా స్రవించు తి
య్యఝ్ఝుగల ద్రాక్షతో పరవశాదరయోగము మేలుకాదొ, శూ
న్యమొ అటుగాక చేవొ అగు అందనిపండులకంటె నెప్పుడున్.

40

You know, my Friends, how long since in my House
For a new Marriage I did make Carouse:
Divorced old barren Reason from my Bed,
And took the Duaghter of the Vine to Spouse.

41

For "Is" and "Is-Not" though *with* Rule and Line,
And "Up-And-Down" *without*, I could define,
I yet in all I only cared to know,
Was never deep in anything but—Wine.

42

And lately, by the Tavern Door agape,
Came stealing through the Dusk an Angol Shape
Bearing a Vessel on his Shoulder; and
He bid me taste of it; and 'twas—the Grape!

౪౦

సహృదయులార! యెన్నిదివసంబులనుండియొ సల్పుచుంటి నా
గృహమున క్రొత్తపెండ్లి సవరించు ప్రయత్నము, లెట్టకేల కీ
విహసితవీథినుండి వెలిపెట్టి పురాతనసూత్రపాలినిన్,
సహజమధుప్రియన్ ప్రణయశయ్యకు రమ్మని ఆమతించితిన్.

౪౧

సూత్రపదప్రమాణములు చూపగజాలుదు అస్తి నాస్తి వా
ద త్రసరంబు త్రిప్పగ; పదంపడి లౌకికపారలౌకిక
క్షేత్రవిచారనిర్ణయము సేయగనోపుదు; కాని యీసురా
పాత్రమునందుదక్క కనుపట్టవు లోతు లికెందు సృష్టిలోన్.

౪౨

కడ కొకసందెచీకటిని, కాంచనభాండము నంసభాగమం
దిడి మెలమెల్ల కాలిడియె నేకత మీమధుశాలవాకిటన్
పడతి యొకర్తె; ఆకనకభాండరసాయన మెంతో ప్రేమ యే
ర్పడ రుచిచూడుమం చొసగె, త్రావితి నే మధువయ్యె నద్దియున్.

౪౩

43

The Grape that can with Logic absolute
The Two-and-Seventy jarring Sects confute;
The subtle Alchemist that in a Trice
Life's leaden Metal into Gold transmute.

44

The mighty Mahmud, the victorious Lord,
That all the misbelieving and black Horde
Of Fears and Sorrows that infest the Soul
Scatters and Slays with his enchanted Sword.

45

But leave the Wise to wrangle, and with me
The Quarrel of the Universe let be:
And, in some corner of the Hubbub coucht,
Make Game of that which makes as much of Thee.

౪౩

పౌరుపున నొండొరుల్ పడక పోరెడి ‘డెబ్బదిరెండుశాఖలన్’
మఱలిచె నేకదిగ్గతికి మా అనకుండ నిమేషమాత్రలో;
మెఱుగుపసిండిగా పరిణమింపగజేసెను లోకలోహ మ
బ్బురముగ నెచ్చెలీ! తలపవో మధుమంత్రమహారహస్యముల్.

౪౪

ఆ బలవన్మహమ్మదు జయప్రభుశేఖరు మంత్రశస్త్ర ధా
రాబహుళప్రభల్ హృదయరాజ్యము ముట్టడివెట్టు నాస్తిక
క్లీబవిచారకాండము ఖిలీభవమంద వెలుంగు చూడు; గా
రాబుచెలీ! ప్రపంచమును ప్రామిన చీకటు లింక విచ్చెడిన్.

౪౫

ఉరివడనిమ్ము పండితుల నుగ్రవివాదల! నిల్వనిమ్ము నా
శిరసుననే విచిత్రమగు సృష్టివిచారము నెల్ల నోసఖీ!
పరిమళశయ్యపై ప్రణయభాగవతమ్ముల నాడుకొంచు నీ
మురిపెము సాగునన్నిదినముల్ సుఖియింపుము మోజు తీఱగన్.

46

For in and out, above, about, below,
'Tis nothing but a Magic Shadow-show,
Play'd in a Box whose Candle is the Sun,
Round which we Phantom Figures come and go.

47

And if the Wine you drink, the Lip you press,
End in the Nothing all things end in—Yes—
Then fancy while Thou art, Thou art but what
Thou Shalt be—Nothing—Thou shalt not be less.

48

While the Rose blows along the River Brink,
With old Khayyam the Ruby Vintage drink:
And when the Angel with his darker Draught
Draws up to Thee—take that, and do not Shrink.

౪౬

బయలను లోన ప్రక్కలను పైనను క్రిందనుగూడ, చూడ నం
తయు నొకయింద్రజాల మగునాటక; మాడుదు రొక్కవేదిపై
ప్రియముల కాగడాయగు రవిన్ వలగొంచును; నీడలట్టు లెం
తయు నటు వచ్చిపోదుము సుతారపు బొమ్మలవంతునన్ సఖీ!

౪౭

ప్రాణి జగాన కెల్ల పరమావధియౌ అల శూన్యమందె యీ
శోణమరందమున్ తదభిచుంబనరక్తిమ గ్రక్కు మోవియున్
లీనము లౌనయేని ? గమనింపుము; కాగల కారణార్థమో
మానదు, వర్తమానపరిమాణము నాగదుగాదె నెచ్చెలీ!

౪౮

సొనకుదరిన్ గులాబి సొగసున్ మిగులన్ వికసించుచుండ, నె
ఱ్ఱనిమధుధార లానుచు కరంగుము ఖాయ్యముగూడి నీవు; న
ల్లనికలశంబుతో మరణలాసిక నిన్ దరియంగవచ్చెనే
ని నిలిచి జంకకుండ తరుణీ! కయికొమ్మదియున్ ప్రియమ్ముగన్,

౪౯

49

'Tis all a Chequer-board of Nights and Days
Where Destsny with Men for Pieces plays:
Hither and thither moves, and mates, and slays,
And one by one back in the Closet lays.

50

The Ball no Question makes of Ayes and Noes,
But Right or Left as strikes the Player goes;
And He that toss'd thee down into the Field,
*He* knows about it all—He knows—He knows!

51

The Moving Finger writes: and, having writ,
Moves on; nor all thy Piety nor Wit
Shall lure it back to cancel half a Line,
Nor all thy Tears wash out a Word of it.

౪౯

ఒకచదరంగపాళి యిది యుగ్మళి! రంగులగళ్ళు రేల్బవల్;
సకలజగజ్జనంబులను సారెలుగా గొని కాలు డాడు; పా
చికలును కొంతసే పనుగుచెల్మి నటించి, ఒకింతలోన మా
రకులయి ఈపలావల పరస్పరమున్ తెగి పేటికం బడున్.

౫౦

బదులిడ, దౌను కాదనుచు ప్రశ్నలువేయదు, ఆటకా డెటుల్
చదిమెడు నట్లు యేగు నపసవ్యమొ సవ్యమొ కందుకంబు; ఈ
చదరమునం దెవండు నిను జాగిల త్రోసెనొ యాత డొక్కడే
తదఖిలచాలనం బెఱుగు తన్వి! యెఱుంగును సర్వమాతడే.

౫౧

పరిపరి వ్రాయుహస్త మది వ్రాసిన నావల బోవు, నీ చమ
త్కరణముగాని ధర్మరతిగాని మరల్పగలేదు దానిలో
నఱసగమేనియుం దుడుప! ఆ లిఖితంబున నొక్కముక్కయున్
చెఱగదు నీదు బాష్పములు చెర్వయి వాగయి వెల్లివోయినన్.

52

And that inverted Bowl we call The Sky,
Whereunder crawling coop't we live and die,
Lift not thy hands to *It* for help—for It
Rolls impotently on as Thou or I.

53

With Earth's first Clay They did the Last Man's knead,
And then of the Last Harvest Sow'd the Seed :
Yea, the first Morning of Creation worte
What the Last Dawn of Reckoning shall read.

54

I Tell Thee this—When, starting from the Goal,
Over the shoulders of the flaming Foal
Of Heav'n Parwin and Mushtara they flung,
In my predestin'd Plot of Dust and soul.

౫౨

ఆకసమంచు పేర్వడినయట్టి వితానముక్రింద, కొన్నినా
ళ్ళేకముగా సుఖించి శమియించెద మింతిరొ ; చేతు లెత్తి య
ట్టాకట దానిసాయమునకై విలపింపకు, మస్వతంత్రమై
ప్రాకెడు నద్దియున్ నియతవర్తన నీవును నేనునుంబలెన్.

౫౩

ఆది మృదండమున్ మెదిపి యంత్యమనుష్యశరీరపిండ ము
త్పాదనజేసి; రావల వెదల్పడెబో కడసారిపంటకున్;
పైదలి! సృష్టిలో తొలిప్రభాతమె తద్గణితావసానకా
లోదయలబ్ధశేషముల నూది లిఖించె యథాక్రమంబుగన్.

౫౪

వినుము ప్రియంకరీ! మొదల బిందునిపాతముహూర్తమందె, ఈ
తనుతరదేహిదేహసహితమ్మగు మామకభాగ్యచక్రక
ల్పనమున సంఘటించి, రల 'పచ్చగుఱ్ఱాలదొరన్' ఛదించి పై
కొనెడు గురుగ్రహస్తబకకూటము, నేమిటి కీవివాదముల్.

The Vine had struck a Fibre; which about
If clings my Being—let the Sufi flout;
Of my Base Metal may be filed a Key,
That shall unlock the Door he howls without.

56

And this I know; whether the one True Light,
Kindle to Love, or Wrath consume me quite,
One glimpse of It within the Tavern caught
Better than in the Temple lost outright.

57

O Thou, who didst with Pitfall and with Gin
Beset the Road I was to wander in,
Thou wilt not with Predestination round
Enmesh me, and impute my Fall to Sin?

౫౫

ఈమధువల్లి నాటుకొనియెన్ సిగవిప్పుచు, దానికౌగిటన్
బ్రామెదు నామనోభ్రమరి; స్వామి శపించిననేమి? యాత దే
ధామముబైట తారసిలు దానికవాటము దీయు బీగమున్
మామకదేహలోహమును మార్చి ఘటించిన చాలు నెచ్చెలీ!

౫౬

ఎఱుగుదు నింతమాత్రము చెలీ! విను; చిత్కళ నన్ను ప్రేమగో
పురమున కెత్తినన్ సెగలువోవు దురాగ్రహభుక్తి కిచ్చినన్
పరమమె; పానశాల గనబడ్డ కలాంశయొకండె కోవెలన్
సురిగి మసిన్ ముసుంగువడు జ్యోతులకంటె మహత్తరం బగున్.

౫౭

నడిచెడి నాదుత్రోవకెలనన్ పలుగుంటలు మాయదారులున్
సుడివడునట్టు లేర్పఱిచి, సూక్ష్మపురాకృతసూత్రబంధముల్
పొడవుగ నన్నిదిక్కులను బూనిచి; ఆవల దారి తప్పి చి
ట్టడరిన నీదు‘పాప’మని యాడక యుందువుగాక దుర్విధీ!

58

O Thou, who Man of baser Earth didst make,
And who with Eden didst devise the Snake ;
For all the Sin wherewith the Face of Man
Is blacken'd, Man's Forgiveness give—and take

59

KUZA—NAMA

Listen again. One Evening at the Close
Of Ramazan, ere the better Moon arose
In that old potter's Shop I stood alone
With the clay Population round in Rows.

60

And, strange to tell, among that Earthen Lot
Some could articulate, while others not :
And Suddenly one more impatient cried—
" Who is the Potter, pray, and who the Pot ? "

౫౮

చేసితి వల్పమృత్పటలిచే మెఱుగారు మనుష్యకాయ, మా
పై సృజియించి తీ ప్రమదవాటికలో పెనుబాము నీవహో!
ఈసుమనుష్యపుణ్యముఖ మే బహుపాపభరమ్మునన్ కళల్
మాసెనొ దానికెల్లను క్షమార్పణమే పరిహార మయ్యెడున్.

౫౯

ఒక రమజాను తుట్టతుది నొత్తగుసందెల చందమామ లే
వకమునుమున్ను నేను నిలువంబడియుంటిని కుంభకారవా
టికకడ నేకతంబున; ఘటీఘటకష్టకుటుంబముల్ నియా
మకమయినట్టులుండె నెడమన్ కుడి పంక్తులుదీర్చి వింటివే.

౬౦

చెలియరో! చెప్పగా మిగులచిత్రము, ఆఘటసంఘమందు మూ
గలు పలుమాటకారులును కానగవచ్చిరి నాకు; నంత తొ
ట్రిలి పెనుతత్తరంబున ఘటీమణియోర్తుక కేకపెట్టె 'నీ
యిల ఘటకుం డెవండొ? ఘట మెద్దియొ? తెల్పెదె'యంచు నర్థిమై.

61

Then said another—"Surely not in vain
My Substance from the common Earth was ta'en
That He who subtly wrought me into Shape
Should stamp me back to common Earth again."

62

Another said—"Why, ne'er a peevish Boy,
Would break the Bowl from which he drank in joy;
Shall He that *made* the Vessel in pure Love
And Fancy, in an after Rage destroy!"

63

None answer'd this; but after Silence spake
A Vessel of a more ungainly Make:
"They sneer at me for leaning all awry;
What! did the Hand then of the Potter shake?"

౬౧

అంత మఱొక్క డిట్లనియె నక్కట ! ఈకరపాదజాతసం
క్రాంతికి నాడు మృత్పటలకల్పన మూరక చేసియుండఁ; డీ
వింతసురూప మిచ్చినప్రవీణుడె నన్ మఱలన్ తదాదివ
స్త్వంతరమందు జేర్పఁగ నుపాయమునైత మమర్చియుండెడిన్.

౬౨

అనవుడు బల్కె నింకొకతె యద్దిర ! యెంతటిమచ్చరీడునున్
తన చవిదీఱ త్రావిన సుధాసుఖపాత్రిక చిట్లగొట్టునే ?
పనివడ జేసె నీఘట మెవం డతిశుద్ధపుప్రేమ, నాత డా
కొనుక్రుధ నావలన్ పగులగొట్టెడునం టది యెంతచిత్రమో !

౬౩

మునుకొని పల్కె రెవ్వ; రొకమూరుత మూగి, వికారరూప మం
దినఘట మొక్క డిట్లనియె దీనత "నందఱు నా కురూప వం
చనదశ కీసడింతురు విచారముమాని, విధాతహస్త మే
మినేపమునన్ వణంకి విషమించెను నన్ సవరించుపట్టునన్"

64

Said one—" Folks of a surly Tapster tell,
And daub his Visage with the Smoke of Hell ;
They talk of some strict Testing of us—Pish !
He's a Good Fellow, and 'twill all be well."

65

Then said another with a long-drawn Sigh,
" My Clay with long oblivion is gone dry :
But, fill me with the old familiar Juice,
Methinks I might recover by-and-by "

66

So while the Vessels one by one were speaking,
One spied the little Crescent all were seeking :
And then they jogg'd each other, " Brother ! Brother !
Hark to the Porter's Shoulder-knot a-creaking ! "

౬౪

కల డంతఃకరణంబులేని ప్రభు వొక్కం డందు; రేతద్దృగం
చలవీథిన్ వచియింత్రు దుర్నరకహింసాధూమధామంబుగా
చెలి! ఈజీవితమున్ పరీక్షయని వంచిం త్రంతె; ప్రేమార్ద్రు డా
తడు సౌఖ్యంబున బుట్టి సౌఖ్యమున నంతంబౌను సర్వం బిలన్.

౬౫

పిమ్మట నూర్పు పుచ్చి యొకవృద్ధఘటం బనె నిట్లు "లస్మదం
గమ్ముల గంధ మెండె చిరకాలపువిస్మృతిచేత, నింపుమీ
క్రమ్మర నాపురాణరసకల్పముతో నను; మెల్ల మెల్లగా
సొమ్ములువాసి ప్రాణములు జోడయి శోభిలనోపు త్రోవరీ!"

౬౬

అటు లాయాఘటముల్ పరస్పరవివాదాసక్తిమై నుండ ఒ
క్కటి చూచెన్ నెలబాలు డంతయు సమాకర్ణించుచున్నట్టు; లం
తట నన్యోన్యము రాచుకొం చఱచె తంద్రన్, తమ్ముడా! వాహకుం
డిటు లేతెంచెడు కాయకాచినబుజా లేడాటలాడించుచున్.

67

Ah, with the Grape my fading Life provide,
And wash my Body whence the Life has died,
And in a Winding-sheet of Vine-leaf wrapt,
So bury me by some sweet Garden-side.

68

That ev'n my buried Ashes such a Snare
Of Perfume shall fling up into the Air,
As not a True Believer passing by
But shall be overtaken unaware.

69

Indeed, the Idols I have loved so long
Have done my Credit in Men's Eye much wrong
Have drowned my Honour in a shallow Cup,
And sold my Reputation for a Song.

౬౭

వాడిన నాదుజీవమును పండినద్రాక్షరసానుభూతి గా
పాడుము, ప్రాణిలేని తనుబంధములన్ గడిగింపు; మావలన్
కాడలుసాగ దొప్పగిలు కమ్మనియాకుల జుట్టి యట్టులే
నీడలతోటపజ్జ శయనింపగజేయుము నన్ను నెచ్చెలీ!

౬౮

పంటవలంతిగర్భమున పాతిన నాతనుధూళిగూడ ది
ఙ్మంటపముల్ సుడింబడ సుగంధరజం బెగబోయజూతు, వా
వెంటన బోవు విశ్వసనవేత్తలలోపల నొక్కఁడేని వా
ల్గంటి! తదీయవాసనబలానకు ముగ్ధుడు కాకపోడుసూ.

౬౯

ఇందనుకన్ వరించి భజియించిన జీవితసూత్రలక్ష్యముల్
క్రిందువడంగ జేసెను సఖీ ; నను లోకులదృష్టి; ముంచితిన్
సుందరకీర్తిపాత్రమును శూన్యసరస్సున; అమ్మినాడ స్వ
చ్ఛందకళావిభూతియును ఛాందసమౌ నొకగీతికే తుదిన్.

70

Indeed, indeed, Repentance oft before
I swore—but was I sober when I swore?
And then and then came Spring, and Rose-in-hand
My thread-bare Penitence apieces tore,

71

AND much as Wine has play'd the Infidel,
And robb'd me of my Robe of Honour—well,
I often wonder what the Vintners buy
One half so precious as the Goods they sell.

72

ALAS, that Spring should vanish with the Rose!
That Youth's sweet-scented Manuscript should close!
The Nightingale that in the Branches sang,
Ah, whence, and whither flown again, who knows?

౭౦

సకియా! పల్మరు బాసతింటి మును పశ్చాత్తాపతప్తుండనై
యకటా! మేల్కొనియుంటినో యపుడు? సత్యంబింతె; తోడ్తో మధూ
త్సుక దేతెంచెగులాబి చేతగొని, నాసూత్రానుతాపాశయ
ప్రకరంబుల్ తునిగెన్ శతంబయి సహస్రంబై సమూలమ్ముగన్.

౭౧

బహుమతియైన నాబిరుదువచ్చుడ మాఅడివోవుగాక, ప్ర
త్యహము లభించెగా కఠినయంబున పాపపుపాత్ర యీమధు
ప్రహసనమందు నాకు వరవర్ణిని! అమ్మెదుదానికంటె నే
మహితపదార్థ మీ క్రయికమండలి విల్చెదరో వచించెదే.

౭౨

కటకట! ఈ గులాబికళికల్ వసివాడ వసంతమేగు; ము
చ్చటయగు నీవయఃసురభిసంహితయున్ ముగియున్ శుభాంగి! పి
మ్మట నెపు? డెచ్చటెచ్చటికి? మళ్ళునొ చెప్పెదవే రసాలని
ష్కుటముల బాడు నీకలికికోకిల; దాని నెవం డెఱుంగునో?

73

AH, Love! could thou and I with Fate conspire
To grasp this sorry Scheme of Things entire,
Would not we shatter it to bits—and then
Re-mould it nearer to the Heart's Desire!

74

AH, Moon of my Delight who know'st no wane,
The Moon of Heav'n is rising once again:
How oft hereafter rising shall she look
Through this same Garden after me—in vain!

75

AND when Thyself with shining Foot shalt pass
Among the Guests Star-scattered on the Grass,
And in thy joyous Errand reach the Spot
Where I made one—turn down empty Glass!

TAMAM SHUD

౬౩

వెలదీ! నీవును నేనునున్ గలసి అన్వేషింపగానేర్తుమే?
ఇల నాద్యంతవిమర్శదూరమగు నీసృష్ట్యంతరవ్యూహమున్;
తలమైనన్ తెగగొట్టి తున్కలుగ సంధానింపమే! దీనిసొం
పెలయన్ గ్రమ్మఱ, నస్మదీయహృదయాభీష్టానుసారంబుగన్.

౬౪

మనకై చూచుచునున్నవా డదియె రమ్యస్వర్గచంద్రుండు, కా
మిని! ఈ తైజసికాంతరాళతరళోర్మిద్వారమార్గమ్మునన్,
తనరారాకల నింక ముందు నను గానన్లేక యీపుష్పపుం
జనికుంజమ్ముల నాత డెంతటి నిరాశాఖేదమున్ పొందునో.

౬౫

పఱచినచుక్కల ట్లతిథివర్గము పచ్చికపై సుఖింపగా,
మెఱుగుపసిండికా ల్గదిపి నీవును పోయెడువేళ; వేడుకల్
విరిసినశూన్యపాత్ర దొరలించితి నేనెట; నాప్రదేశమున్
దరిసెద వాత్మసాంత్వనవిధాయకయాత్ర ముగించుమన్ సఖీ!

# రాయప్రోలు
# సుబ్బారాయ కృతులు

లలిత

తృణకంకణము

కష్టకమల

స్నేహలతాదేవి

తెలుగుతోట

స్వప్నకుమారము

ఆంధ్రావళి

జడకుచ్చులు

మధుకలశము

రమ్యాలోకము

